కళాకేళీ ప్రచురణలు : 21

# వయాజ హానా

(గేయ సంపుటి)



మహాకవి వేదుల సత్యనారాయణ శాస్త్రిగారి
ఉపోద్ఘాతంతో



శశాంక

తొలిసారి : వేయిప్రతులు

జయ : వైశాఖం

1951 : మే



కళాకేళీ ప్రచురణాలయం

సామర్లకోట.





Edited and Published by D. Ramsha for Kalakeli Publications, SAMALKOT and printed by Ambati Anjaneyulu Sri Rama Press; Samalkot.



కంఠమా కంఠమా ఎందుకే గద్గదము?
చిత్తమా చిత్తమా ఎందుకే తత్తరము?
సోమసుందరు ప్రేమచలువులో పులకించి
కవితాశరజ్జ్యోత్స్నగానమాధురి నించి
కలకాల మతగాని కొలువులో విలుచుకొను
సమయ మేతెంచెనే సరిగ సవరించుకో!

*

పార్వతీశ్వరు తలను నెలవంకవై మెరయ
కల్హార హృదయాన కవితాసుగంధమే
విచ్చుకొని మత్తుగా జగమెల్ల గుబులుకొనె!
హాయిగా తీయగా బ్రతుకెల్ల పాడుకొనె!
ఓ శరచ్చంద్రికా! మలయానిలోర్మికా!
పాడవే పాడవే కవితాకుమారికా!

*

జగతి నలుదెసలలో కనలు జనులెల్లరకు
వజ్రాయుధమ్ముతో స్వర్గమే నెలకొల్పి
కాహళీస్వనముతో కాలమే పరిమార్చి
బానిసలదేశమున కాశయే రగిలించు

సోమసుందర కావ్య గంగా లహరిలోన
దోలగా తేలవే యువరాజహంసమా!

*

సిరి తోడబుట్టువుగ క్షీరాబ్ధిలో బుట్టి
సోమసుందరు డిపుడు ప్రేమబంధురుడయ్యె
చిననాటి నీ వలపుచెలికాడు కాడటే!
నిలచి యాతనితోడ పలుకాడరాదటే!

ఎందుకే వెందుకే ఎందుకే జవరాల?
ఎందుకే నునుసిగ్గు నిలువు మాతని మ్రోల!

*

(నా ఆబాల్యకవిమిత్రుడు శ్రీసోమసుందర్ కి
అంకితపురస్సరంగా)

# పొద్దుపొడుపు పువ్వులు.

శ్రీనాథకవిరాజ చిత్రవర్ణాకీర్ణ
పరిమళోద్యానిలో భావమెంచి,
రాగరంజిత త్యాగరాజ సంకీర్తనా
రామణీయకములో రాగమెంచి,
కృష్ణవేణీసముత్కృష్ట నర్తన కళా
కేళీతరంగిణిన్ తాళమెంచి,
ఆంధ్రసామ్రాజ్యోదయానందవేళా స
మారంభసంగీత మందుకొనగ
కావ్యగానముచేయు పత్కృవులు వెలయ
యావదాంధ్ర ప్రతిభ మన భావినిలువ
పుడమివిడె నెత్తుమందార పూవుపగిది!
పరిమళించెను బ్రతుకు సంపంగికరణి!

నన్నయ్య మొదలుగా నాచోటి కవిదాక
గల యాంధ్ర సుకవితా కౌశలమ్ము
భారతమ్మాదిగా బడి పొత్తములదాక
గల యాంధ్రసాహితీగౌరవమ్ము
శ్రీకాకుళము మొదల్ చిత్తూరు కడదాక
గల యాంధ్రదేశీయవిలసనమ్ము
ముసలివగ్గులు మొదల్ ముద్దుబిడ్డలదాక

గల యాంధ్రజాతీయ కలకలమ్ము
గొంతుగొంతున గానస్రవంతిగాగ
పుటపుటాంతర్గత పురాణబోధగాగ
దిక్కుదిక్కుల ధ్వనియించు బుక్కుగాగ
పొడిచె నిపుడిప్పుడే తెన్గు ప్రొద్దుపొడుపు!

బ్రతుకు బ్రతుకున తీయనిపాట రేగి,
గొంతు గొంతున గానస్రవంతులురలి,
దేశదేశాల తెలుగుల దీప్తివెలుగ,
పొడిచె నిపుడిప్పుడే తెన్గు ప్రొద్దుపొడుపు!

ప్రాభాతోత్సవమయ్యె;
ప్రాగ్దిశ నుషారాజీవరాగాంశువుల్
శోభారామముగాగజేసె ప్రకృతిన్;
భూతాంచలాలంకృతిన్
భూభాగమ్ము వసంతరాగ
రస సంపూర్ణమ్ముగా దోచె;
ప్రాతర్ భానూజ్జ్వల స్వర్ణకాంతులలమెన్
త్రైలింగసామ్రాజ్యమున్!



# చిత్రకంతం

నిలచెను ఒక పేదో నిరాశగా నల్లనిమల-
కలచెను నాహృదయం పరిపరివిధముల;
యుగాల తరబడి అవిరామంగా
సాగెను మానవతపస్సు;
వైదొలగలేదు ఇప్పటికీ
జగతిని చుట్టిన తమస్సు!
హిమాలయోన్నతశృంగం
నిలచిన చోటునుంచి
అంగుళమైనా కదలదు!
హారతికర్పూరంవలె వెలిగే
పచ్చని వెచ్చని సూర్యరశ్మిలో
మృత్యువువలె నీడలు, బ్రతుకును
వెన్నాడుతునే వున్నవి!
అడవుల నడిమధ్యన కాలిదారి
ఎప్పటివలెనే
కంటకమయమై పయనానికి
అవరోధం కలిగిస్తున్నది!
అయినా—
మానవతపస్సు సాగాల్సినదేనా
పెనుతుఫాను అలజడులందున

ఆశల ఆకాంక్షల వృక్షవితతి
అడుగడుగున నేల కొరుగుతున్నా
మానవతపస్సు సాగాల్సినదేనా ?

ఎత్తగు పర్వతాలవంటి బాధల
లోతగు జీవితజలధిని కూలద్రోసి
సమతలసౌఖ్యం చూడాలను పుడమిని
పర్వతాలు అణుమాత్రం చెదరక పోగ
భీకరరూపం దాలిచి విజృంభిస్తున్నా
మానవతపస్సు సాగాల్సినదేనా?

* * * *

విరిసెను హసితోత్పల కల కల కల
నా కనుకొలకుల తెల్లని ఆశలకల !
జీవితవాతాయనమును తెరచుక
పొలియిక వైదొలగినదట !
గ్రహకూటం గతులుతప్పి
తెల్లబోయి నించున్నది !
ఖగోళాంతర మందున
వినవచ్చే విశ్వరహస్యం
భూకర్ణం గ్రహియిస్తున్నది !
హిమవత్పర్వతమే కరిగి కరిగి
మహాసముద్రమున కలసిపోయినది !

తన్ను తాను మరచి
అరణ్యహృదయం సాగిస్తున్నది
తరగని తపస్సు!
పక్షుల కలకూజితముల నేవో
వినిపిస్తున్నవి ముగ్ధమంత్రములు!
వాతపోతములు విహరిస్తున్నవి!

"జీవిత వాతాయనమును తెరచుక
వైదొలగినదట నేడే పొలియిక!
జీవిత భవనద్వారము తెరచుక
అరుదెంచినదట ఉత్కంఠోద్గీతిక"



## వసంతగీత

అనురాగజలధిలో మీనమవుతాను
ఆనందపాథోధి లీనమవుతాను!

సంతస వసంతవన
సంతతుల పరిమళము
లాసుమెలదేటివలె
పాడుసెలయేటివలె

ఈ ప్రేమవనములో పరుగులిడతాను
ఈ కడలి యొడలిలో కరగిపోతాను !

సనజాజి కనుగీటి
కవ్వించు నన్ను
మల్లె మనసునువిచ్చి
మాటాడు నాతో

తావినై ప్రేమైకజీవినై లోకైక
భావినై తీయనగుపాట పాడిగిస్తాను !

చివుర్లగు పూల వా
తెరకిరింది చెవులతో
ఆలకిస్తాను లో
కాల విన్పిస్తాను

ప్రీతి వసంతమ్ములో పాడుకొంటాను
భీతిమించి రాగాన సోలిపోతాను !



# ఉదయతార.

తూరుపు దిశలో సూర్యులు
తొంభై మందుదయించారేమిటీ !
ఇరుల బరువు భారంతో
కృంగు తెలుగు పుడమి నేడు
వెలుగు కలల అలలపైన
తేలుతూన్నదేమిటీ !

తూరుపుదిశలో తోచిన
తొంభై మందినులు నేడు
ఎల్లకడల పుడమిపైన
అడుగిడతారేమిటీ !

సౌఖ్యోన్నత భూభృత్తుల
సామీప్య గుహాంతరాల
దుఃఖాంధము తొలిచి తొలిచి
ప్రవహిస్తారేమిటీ !

చీకటి కుటి చీకాకుల
చెండుతారదేమిటీ ?
హృదయం విరిదామరయై
వికసిస్తోందేమిటీ ?

మీదనున్న పొగమంచులు
చెదురుతూన్న వేమిటి ?
అగ్నిలాగ ఆశరేగి
ఎర్రి బావుటాల పాట
నేల నాల్గు చెరగులలో
రగులుతూన్న దేమిటీ ?

రోడ్డుపోయు కూలివాళ్ళ
వెన్నులపై చెమట చెరిగి
గుండెలలో సంగీతం
రేగుతూన్న దేమిటీ ?
యువజీవిత నవపేశల
కోలాహల గీతులతో
ముదిమిబ్రతుకు కోలాటపు
టడుగేస్తోందేమిటీ !
వదలలేక చెదరి చెదరి
పేకువాయెనేమిటీ !

కలత నిదుర కలగి కలగి
మేలుకువాయెనేమిటీ !
కను కొలకుల పొద్దుపొడుపు
తళుకు లలమెనేమిటీ !

* * * *

మందారం ధిక్కారం
ప్రకటిస్తోందేమిటీ !

అవమానిత వనితాహృది
తెలుగుగడ్డ పడగలెత్తి
మదమెక్కిన రాక్షసిపై
బుసకొడుతోందేమిటీ !

శాసనా లశాంతిరేపి,
ఛేదించిన శిరములిపుడు
హంతకులకు తీర్పు చెప్ప
కదులుతూన్న వేమిటీ !

ఎలమరుగిన ప్రజ్వరిలిన
ప్రతీకార కీలనేడు
ఓటుపెట్టె బీటలోంచి
ప్రవహిస్తోందేమిటీ !

కృష్ణానది కపోలాల
ఆనందా లేమిటీ !
హరీన్ ఛటో బెజవాడను
ఆంధ్రదయా దేమిటీ ?

గంగా సింధూ నదులే
కృష్ణా గోదావరులకు

తలలు వంచి అభివందన
మర్పిస్తాయేమిటీ ?

* * * *

మనిషి మెదడు గదులలోన
ఆలోచన లేమిటన్న
పరిశోధన మదరాసున
సాగుతోంచదేమిటీ ?

బ్లాకవుటున లైటు హవుసు
వెలుగుతోందదేమిటీ ?
కుళ్ళుతాగి కూమురివయి
షిపరువుతూందేమిటీ ?

గిండీలో హార్సురేసు
డ్రానవుతోందేమిటీ?
అడయారున గులాబిలో
అలజడి పాటేమిటీ ?

అంపశయ్య హార్బరులో
భీష్మతప్తజిహ్వాగ్రము
నవిరళపాతాళగంగ
తడుపుతూన్నదేమిటీ ?

సెంటు జార్జి కోట మీది
జెండా రెపరెపల లోంచి
జీవన్మృతు లందరికీ
చెవుల పడేదేమిటీ ?



# ముక్కోటి.

పొద్దు చెంగట సంజ పొంచివున్నది చూడు !
మేలుకొమ్మని కోడి కూసినది యీనాడు !
లేవోయి లే యింక లే తెలుగుబిడ్డా !
నిలుపుకో మెలకువగ నీతెలుగుగడ్డా !

చదునగు వితర్దిని కపర్దివలె కూర్చుండి
మంత్రిగాడై మహామంత్రి రుద్రాక్షలుగ
తెలుగు వీరుల కపాలాల నన్నిట జేర్చి
తనచేతిమాలగా త్రిప్పుకొంటున్నాడు !

రాష్ట్రనిర్మాణ రణరంగమున నిహతుడై
చనిన శ్రీరాములై చనిపోయి రెందరో
తెలుగుతల్లికి కడుపు శోకమొనగూడినది
నిలువునా ఉరిపీఠ మెక్కించబడె జాతి !

గోదావరీదేవి గొంతెండిపోయింది
కృష్ణ కన్నీరొడ్చి సొమ్మసిలిపోయింది
నిలువు నిలువున మాతృమూర్తి క్షోభించింది
తెలుగు కన్నీరొలికి మిన్నేరు మించింది !

తెలుగు వాకిట దివ్వె కొడిగట్టుతున్నాది
వెలుగారిపోయి బ్రతుకణగారుతున్నాది
ఉద్యమోద్రేక తైలముపోసి త్రిలింగాన
వెలిగించు వేగమే ఆంధ్రరాష్ట్ర జ్యోతి !

పల్లె పల్లెకు పిల్ల లుద్యుక్తులైనారు
విద్యార్థు లుద్యమోత్సాహులై కదిలారు
నాయకుల టోపీలు తీసిపారేశారు
మాయలమరాటీల ఆటకట్టేశారు
కాకినాడను మహోద్రేక ముప్పొంగింది
రాజమహేంద్రిములోన రైలాపివేశారు
నెల్లూరులో నెత్తురేరుగా పారింది
బెజవాడలో విజయభేరి మ్రోయించారు !

ఎక్కడెక్కడ ఎందరన్నలు గతించారో
అందరన్నల ఆత్మశాంతికై ఘూర్వేళ
తండోప తండాలుగా జనము లూరేగ
'శాంతి'లారీలపై వెన్నాడుతున్నాది !

క్రోధఘూర్ణిత త్రినేత్రమ్మునే విప్పగా
సాయుధమ్మగ నిలచిన సమకట్టుతున్నాది
నల్లకళ్ళద్దాల నరహంతకులయాజ్ఞ
తలదాల్చి విలయాగ్ని రగిలింపనున్నాది !

శీత శీకరకరాలు ముందుకుసాచి
భీతావహమ్మగా మృత్యువు విలంఘించె
వచ్చుసంక్రాంతికై తెలుగుదేశమునిండ
ఇంటింటి కొక్కొక్క భోగిమంటేద్దాము !

తెలుగునేలను తెలుగువాడొకడు తప్పించి
వేరెవడు పాలించలేడు లేడనిచెప్పి
మ్రోగించు జయగంట నలుదిశల నేడే
సాగించు జేగీయమానముగ నేడే !

తెలుగు రక్తము తల్లినొసట కుంకమ్మగా
తెలుగు త్యాగము తల్లిమెడలోని నగలుగా
తెలుగు బిడ్డలనవ్వు సిగలోనిపువ్వుగా
తెలుగులో విజిగీష జిల్గుదళ్కొత్తగా
లేవోయి లేయింక లేతెలుగుబిడ్డా !
నిలుపుకో మెలకువగ నీతెలుగుగడ్డ

వరిచేల శిరమెత్తి సిరి నాట్యమాడగా
శరదాబ్జ జలదాలి మిలమిలా మెరయగా

నెలమేచు లలవోకరాగాలు తీయగా
తీయగా తెన్గుపూదేనియలు కురియగా
రేవోయి రావోయి రాతెలుగుబిడ్డా !
నిలుపుకోవోయి నీ బంగారుగడ్డా !

# అశ్రుచిత్రాలు.

## 1. అడివి బాపిరాజు దివ్యస్మృతి

నువు చనిపోయావా....?
లేదు....లేదు....
నువు మరణించావంటే
అవాచ్య మనిపిస్తూన్నది !
అందుకనే నువు మరణించలేదు....
అందుకనే,....నువు హాయిగ
నవ్విన నవయౌవ్వన దినాల
మరందనిష్యందం ఆకాశం
కెంబెదవుల ప్రతిబింబిస్తూన్నది !
అందుకనే నీహృదయంపూసిన
ఆశాసుమవల్లీ ప్రసరిత
సుగంధ మరుదంకురమై
రోదసిపూసిన ద్వాదశివెన్నెల
వికసిస్తూన్నది !

తీయామని యామినిహృది
లోపలి కోయిలగొంతులు
నిలోపం లోలోపలి
భావగీతి వెల్లువవలె
పొంగిపొంగి ప్రవహిస్తున్నది !
అదే నువ్వు చనిపోలేదని నిర్ధారణ !
నువు మాతో వున్నావన్నందుకు తార్కాణం !
నీ బ్రతుకు గులాబీరేకుల పరిమళ
లహరిని, మా నాసికలే పడవలుగా
తెరచాపల నెత్తుక పయనిస్తున్నవి !
ఈవిచార సాగర మధ్యమ్మున
తూగాడే మాతనువుల
నేదో విశ్వాసం
పునీత మొనరిస్తున్నది !
మా కనుకొలకుల పేరుకొన్న కన్నీటిని
ఏవో విచలిత వీచీవాయుహస్తములు
విదలిస్తున్నవి !
నువు మరణించలేదు....
అలా మరణించలేవుకూడ....
నువు ప్రేమించిన పచ్చనినేల
విడిచి బ్రతుకగలవుర బేల !
నువు నిర్మించనున్న బంగరుమేడ

పూర్తి కాక వైదొలగ గలవె రేడ!
నీ పేర్రియసి ప్రియగీతిక గోదావరి
భావోన్మీలిత ఫేన విభావరి
పిడచి గడచి నీకేమీకాదని,
ఈ పుడమిని నీదన్నది ఏదీ లేదని
తలవంచుకు వెళిపోగలవా....?
లేదు.... లేదు....
నువు మరణించలేదు....
అలా మరణించలేవుకూడ !



ఏమో....
నువు చనిపోయావేమో ...
లేపోతే ఏమిటి ఈచీకటి....
ఏమిటి ఈచీకటి మెడలో
దుఃఖాశ్రుమాల.... :
ఏమిటి యీవటవృక్షం
శాఖాంతరముల
నిట్టూర్పుల గాడ్పులు !
అమృతగీతం పాడిన గాయకుడే
మృతినందినటుల.... !
జీవితమే గీతంగా వినిపించినకాలం
మూగవోయినటు.... !
ఏమిటి ఈచీకటి ?

మృత్యువు వాతబడ్డ నీకై దుఃఖించే
నెచ్చెలిజడపాయలుగా
పాయపాయలై ప్రవహిస్తున్నాయా
మహానదులు !
చీకటి నీ కనుమూతను సూచిస్తూ
విశృంఖలముగ విజృంభించినదా....
భూమ్యాకాశాల్ రెప్పలుగాగల
జగద్వ్యక్షి మూతపడిందా—?
ఈజగతీ నేత్రాంచలమున
సర్వ మహార్ణవములు ఒకేఒక్క
బాష్పబిందువై పోయినవా?
ఏమిటి జగచ్చిత్రశిల్పి
ఏమిటి యీ బొమ్మలకర్థం !
ఉప్పొంగెను గోదావరి నిను కనినందుక....
భోరుభోరుమని విలపిస్తూన్నది
నువు చనినందుక—!
నీతోటే పుట్టినదాలోకం....?
నీ వెనువెంటనె పోయినట్టు
కనిపిస్తూన్నది :
త్వదీయ హృదయ ప్రసారితోజ్వల
మయూఖ రేఖలు
నీ అస్త, మయంతో,—

ఈలోకపు చిత్రపటంపై
వెలవెలపోతున్నా యెందువలన....
ఈలోకపు ఫలవృక్షంపై
విశ్రాంతిని నిశ్వాసించే
పిట్టల తనువులు
నీ హృదయానికి ఆనందం కల్పించుకొనగ
అనురాగాన్నాలాపించాయెందుకు ?
నీ అస్తమయానికి విషాదవదనం ధరించి
నల్లనిచీకటి కౌగిలి కబంధీ లవుతాయెందుకు ?
ఏమిటి జగచ్చిత్రశిల్పి
ఈ చిత్ర విచిత్రాలేమిటి ?

జీవిత కాగితాన్నివదలి
ఆకాశ మనోఫలకంమీదను
జగచ్చిత్రశిల్పి చిత్రిస్తున్నావా
మానవజాతి చరిత్రం....!
ఉదయాద్రిని కుంచెపుచ్చుకున్నావా
మళ్ళీ....
చటులపిడిలి ఎర్రనిరక్తం
ప్రసహిస్తోందేమిటి ?
ఓహో...
స్వేచ్ఛా సంగర రంగస్థలిలో

క్షతగాత్రులైన యువతీ యువకుల
అంగాంగమ్ముల ఎర్రనిగాయాలా....!
మదాంధులగు భూభర్తలు
ధరణీతరుణీవసనం
తొలగిస్తున్నారా... !
ఏమిటి జగచ్చిత్రశిల్పి
ఏమిటి యీ బొమ్మలకర్థం....?
ఎప్పుడు నీవుదయంమళ్ళీ....
ఈమృదుల జగత్సరోవరమందున
మానవహృదయ సరోజాల్
జ్ఞానజ్యోతుల రేకులవిరిసే
శుభసమయం ఎప్పుడు మళ్ళీ....
నల్లని తూరుపుకొండల చీకటిచీలిచి
ఆకాశం పంటపొలంపై
వెలుగుల నాగలి చాలులనించే
హాలికజన శ్రేష్ఠుడవై
పరిభవించుట ఎప్పుడుమళ్ళీ....
ఎప్పుడు జగచ్చిత్రశిల్పి
ఎప్పుడు....ఎప్పుడు....?



# 2. స్టాలిన్ మరణంపై

లోకానికి బంధువో
వివేకానికి సింధువో
ఎవరు—ఎవరు....
ఎవరు—ఎవరు ....
ఎవరిప్పుడు కనుమూసిరి !
ఏమది చీకటులు ముసరి
నామది చీకాకులెసగు !
మాస్కోలో.... క్రెమ్లిన్ లో
గడియారం ఉక్కుముల్లు
కళ్ళు తేలవేసినదా,—
కాలం భూదేవివాడిని
దీర్ఘనిద్రలో మునిగెను....?
లోతగు చీకటిని ఇనుడు
మునిగి లేవకున్నాడా,—
తూరుపు యెరుపెక్కి జగ
జ్జ్యోతివెలుగ దీరోజన ..?

లోకబంధు వొకడుపోయి
శోకాకుల సింధువెగసి
ఎగసి ఎగసి నల్గడలా

చుట్టుముట్టు చున్నదేల....
తూరుపులో, పడమరలో,
ఉత్తరమున, దక్షిణాన
విషాదధూమ మెల్లయెడల
నాక్రమించు చున్నదేల....
దశదిశలా మానవహృది
సంక్షుభితాకాశమ్మయి
జనుల కనులెతారకలై
చెమ్మగిల్లు చున్నవేల....!

ఊర్మికాకల్లోలితమా
ఉదధి బ్రతుకనంతమా
ఈ మానవ మహాహృదయ
మిటులే వగటొగులునా....?

ఆశాలవలేశమై ఆకాశం
విస్తు పోవునేలా ?
ఇది లోకోపదర్శనమా
ఇది శోకారావమా....?



# నా విషాదగీతం!

అరరే ....! పెర్మటాంగ్ టింగీ!
అరె! పెర్మటాంగ్ టింగీ?
నీరు కారిపోతావేం టింగీ?
అలా వాణికి పోతావేం?
ఆందోళన పడతావేం?
అలజడి పడిపోతావేం టింగీ!

మలయాలో,—
టెంప్లర్ యుద్ధోన్మాదుల వలయంలో,—
మానవ వినాశవాద
నిలయంలో,—
మలయాలో,—!
భీతావహమై దేహం
అలా వాణికి పోతోందేమే?

బిక్కబిక్క పోయావేం టింగీ?
నువు బిక్కచచ్చి పోతావేమే?
కంటినిండ నిదర్రిపోయి
ఎన్నిదినాలాయెనె నాచెల్లీ!
ఓ పెర్మటాంగ్ టింగీ!

ఎందుకలా దుఃఖిస్తావ్
వెక్కి వెక్కి రోదిస్తావ్ ?

చంటిపాప నోటికి
ఏ పాలచంటి నందివ్వని కారణమున
ఉరోజాల విషోరగాల్
బుసకొట్టెనేమె టింగీ !
నేలవాలి పొరలాడెదు
మెలికలు చుట్టుకుపోయెవు
వెందుకనే టింగీ ?
ఓ పెర్మటాంగ్ టింగీ !
చీకటివలె కుటిల కుంతలాల
నీదుసుందర దరహాసకాంతి
చంద్రికా విలాసములను
మకిల పరుస్తున్నాయేమే !

టెంప్లరుగాడేం చేశాడమ్మా !
ఏఇంటా అలికిడిగల జాడే
అగుపడదేమే టింగీ !
చెట్టుకొమ్మ నాశ్రయించి
జీవితాన్ని వెళబుచ్చే
గువ్వగూటి ముంగిటయిన

ఏపులుకూ పలుకుకూడ
వినపడదేమే !

ఓ పెర్మటాంగ్ టింగీ !
నా చెల్లీ—!
పదికోసుల దూరంలో
మెలకువుండలేక ఆవులించు
ఒక్క తుపాకీకి
ఇందరు నరులెల్లకూడ
బందీలై పోయారేమే !
కాట్రిడ్జికంట నిప్పులురలి
గర్జించిన మాత్రంచే
మైళ్ళకొలది నిశ్శబ్దం
కనులుమూసి అంగలార్చి
నేలకూలు తున్నాదేమే !

టెంప్లరు గాదొక్కడుగా
ఏమిచేయగలడు నిన్ను చెల్లీ !
చంటిపాపనోటికి చన్నివ్వలేని తల్లీ !
నీలోపలి దవానలం
సర్వస్వం వ్యాపించెనె చెల్లీ !
ఓ పెర్మటాంగ్ టింగీ !

అందుకనే వార్సాలో
అందుకె కలకత్తాలో
అందుకనే ఏలూరున
అందుకనే పూరూరున
అందుకనే ! అందుకనే !—
ఎడదఎడద గడపగడప
బ్రతుకు కారణాలు రేగి
శాంతితో రణాలు వేళ్లి
నీ కమృత మొలికిస్తూ
నీకూపిరి పోస్తున్నవి !

ప్రతీ గుండెకోటలలో
శాంతిపావురాలపాట !
ప్రతీమనిషి బ్రతుకుబాట
కిరువైపుల పొంచివున్న
సమర పిపాశువుల వేట
సాగుతోంది ప్రతిచోటా !
నీ కమృతమందిస్తూ
అమరత్వంసాధిస్తూ
సాగుతుంది ప్రతిచోటా !
ఒహో పెర్మటాంగ్ టింగీ !
ఓహోహో పెర్మటాంగ్ టింగీ !
ఓ పెర్మటాంగ్ టింగీ నాచెల్లీ !

[పెర్మటాంగ్ టింగీ : జనరల్ టెంప్లర్ చే దిగ్బంధించబడి మారణహోమం గావించబడ్డ ఒక మలయన్ గ్రామం]

# హృద్గీతి.

టక్....టక్....టక్ ...
టక్....టక్....టక్....
నేకుంటివాని వూతకోలనండీ !
నా బాధలుగాధలు వినరండీ !
యుద్ధంలో కాలుతెగిన గెరిల్లాకు
ఆసలాంటి ఆసరాన్ని !
ముప్పుగడుపు అవసరాన్ని !
ఈ విధ్వంసక జగతీ సంక్షోభంలో
నాకుత్తుక అడుగడుగున
మూలుగుతున్నది.
నెత్తురుతో తడిసిన
ఎర్రని బ్రతుకుబాటపై
నన్నానుకు నడచే మెదడున
ఒకటొకటిగ కూలెను మేడలు.
దిశమొలతో నిలబడిగోడలు,
దిగాలుపడి దిగంతాలలో—
పారించెను దృష్టులు.
తూటాదూసినతుపాకి
గొట్టంపొగలో,—

వెన్నువిరిగి నేలపడిన ఆక్రందనలో,
దావురుమని రోదించెను భవిష్యత్తు :
టక్ .... టక్ .... టక్ ....
టక్ .... టక్ .... టక్ ....
ఛీర ఉరలి శ్రుతిరహితంగా
ప్రవహిస్తున్నవి గొంతునగీతులు
బరువుదించి తేలికగా మోచిస్తున్నవి
చిట్టడవుల కట్టెలమోపెత్తిన శిరములు
నాయీబాధా కథనకంఠం
ఎన్నో వ్యథాకులిత గీతాలకుమకుటం :
ఈ విశాలజగతీ కర్ణాంతరముల
గింగురు గింగురుమని ధ్వనియిస్తున్నది !
వికలాంగులైన సకల జనులరోదన
నా బాదామయదేహంలో
ధ్వన్యనుకరణం పొందుతూంది!
అంధులబధిరుల అంగవిహీనుల
ఆక్రందనలే నదులై,
నా సముద్రిగర్భం ఛొరబడుతూన్నవి !
నా కంఠం బాధలతో బొంగురు పోతూన్నది !
నా గుండెలు గాధలతో లోలయి పోతూన్నవి !
ఈ విధ్వంసక జగతీసంక్షోభంలో
నా కుత్తుక అడుగడుగున మూలుగుతున్నది !

టక్....టక్....టక్....
టక్....టక్....టక్....
మానవ మారణహోమం పేర్చిన
యుద్ధోన్మాద మృవనతముఖియై
కాలిబాటనవేర్లితో నేలను గిలిస్తూన్నది ;
నెత్తురుతో తడిసిన నాగుంచెటు
ఈ బాధల ప్రకంపనలో జాలువాపచె
ఆశల ఆకాశంలో రెపరెపమంటున్నవి !
నిస్తంత్రివార్తా వాహినివలె
ఈ ప్రపంచానికంతకు
బాధామయగాధల
ప్రసరిస్తున్నవి !
టక్....టక్....టక్....
టక్....టక్....టక్....
నే కుంటివాని వ్రాతకోలనండీ!
నా బాధల గాధలు వినరండీ!



# కపోతోత్సవం.

ఓహోహో కపోతం
నా జీవితసంగీతం
ఓహోహో కపోతం !

ఆదిని వాల్మీకి గొంతు వెలువడి
మా నాటివరకు మార్మోగిసిన గీతం !
తమసానది తీరభూమి
వేటాడు కిరాతుమూపు
నమ్ముల పొదిలోంచి లేచి
మెత్తని నీ పొత్తిలిలో
అలుగు దూసుకున్నాడె
ఎలుగెత్తెనె కవికంఠం !
అశాంతిరేపు కిరాతకుల
ఆ నాడే శపియించెనె !
నీ రెక్కలు తుదిసారిగ
ధరణి కొరగి విలవిలమని
తన్నుకున్న మరు నిముసమె
కావ్యమ్మాశ్వాసించెనె !
కిరాతు ఘాతుకమ్ముకతన
నేలపడినకొంచి !

గిలగిలగిల తన్నుకొనే
మరణం మదినెంచీ,—
వాల్మీకి మహాకవితాచల
సానువులను జలజల
సెలయేరువోలె
పరతెంచెనె కరుణజలం !
ఓహోహో కపోతం
కరుణావహ గీతం !
కవిహృదయ క్షీరాబ్ధిని
జనితామృత నవనీతం ;
జనతా జీవనగీతం !



ఓహోహో కపోతం
మేఘోన్మీలితహాసం
వినీలగగన వీధినెగురు
తెలిమబ్బుల పింజపగిది
పరుగిడు నాపందమంద మారుతం !
ఓహోహో కపోతం !

యుద్ధభయోత్పాతంలో
అలజడిపడు పక్షిపించాన

కలికాలపు కలవరాన
ఆశాకిరణమ్ము కరణి
ఉదయించిన కలవరం !
నిలిచేందుకు నీడలేక
ఎగిరి పల్లటీలుకొట్టు
నరుని జీవితోదంతం;—
పశ్చిమోత్తరాన నీకు
ఆస్కారం దొరికిందా ?
ఆలీవ్ తోటల లోపల
ఆశ్రియమే కుదిరినదా ?
హోయాంగ్ హో నదిలోయల
ఆహారం దొరికిందా ?
హిమవద్గిరి భుజస్కంధ
మెక్కి నువ్వు నవ్వి నన్ను
మరి మరి మురిపిస్తావేం ?
నామది కికురిస్తావేం ??
ఓహోహో కపోతం
నా కవితాగీతం !



"హృదులలో వసంతమైన రోజునస్
మృదులతాంత గుచ్ఛముల సువాసనస్

మరణమే దురాక్రమణము చేయగా
రణమయమై ధరణీతలి విషవాయువు లెగయగా
ప్రియసఖా.... ప్రియసఖా.... వెతలతా....
కదలక నిలుచున్నా వాపదలతా....?"



ఓహోహో కపోతం
నరనారీ హృద్గీతం
ప్రాతరరుణ తరుణకిరణ
నవజీవన మధూత్సవం!
ఓహోహో కపోతం!

న్యూయార్కున వాల్‌స్ట్రీటున
అణ్వస్త్ర జటాయువులను
సంధిస్తున్నాడెవడే?
వక్రబుద్ధి కుటిలాత్ముడు
వెర్రివేటగాడు నిన్ను
బెదిరిస్తున్నాడేమే?
నిన్నా మొన్నటికతలే వేవేత్ల
విషనాగులవలె యెగబడు
ననిమరిచావే పాపం?
వాల్మీకి పెదవిశాపానికి

కాల్దోషం పట్టిందను
కున్నాడేం కర్మం ?
తమసానదిలో ఒంగుని
తమసం తన మనసారా
సేవిస్తా డేంచెయ్యం ?
వాల్మీకుల మనేకులం
హెచ్చరికను చేస్తున్నాం
శాపా లురలిస్తున్నాం !



ఆశాసుమదామములీ
అర్ధరాత్రి కూరిచితే
నిరాశ గరళమంటకు.డ
ఏ గళమును దాలిచితే
సితవికసిత పారిజాత
        కాంతిశాంతులీనుతే
పుడమి తల్లియెడదకలలు
తొలివేకువ రేకులగును
పచ్చని లావణ్యశ్రీ
నవరజమ్ము జగమునలరు !



రెప రెప రెక్కల్ వెలార్చి
జల జల జలగాల తేలి
ఆనందాలందించే కాంక్షించీ !

భువి భవితచ్ఛవులమైన
కవులం మేమందరమూ
నీ మృదు పక్షాంచలాల
వెలువడు మలయానిలాల
తేలితేలి తూగుటూయ
లూగాలని మనసారా
స్వాగతగీతాన్ని పాడి
ఆహ్వానిస్తున్నామే !

ధాతల్లి కపోతం
విశ్వశాంతి కళ్యాణం
కవితా హృన్మరందం
జనతా జీవితగీతం
ధాతల్లి కపోతం !

శాంతికోరి రాముందుకు
సాచు రెక్క మామీదకు
నిరాశ లేదు లవలేశం
ప్రకాశమాన మానవాళం

రాతల్లీ సుమవల్లీ
రాతల్లీ కపోతం
విరియించుము విభాతం .
ఎడారి పుష్పితోద్యాన
మ్మొదయే ప్రమదాంభోజము
జనత కళాప్రసూనమ్ము
జగతి కల్పభూజము
శాంతిభ్రమర ఝుంకారం
క్రాంతి జీవసహకారం
సాచు రెక్క మామీదకు
శాంతికోరి రామ్ముందుకు !

ఓహో జీవనగీతం
ఓహో మానవగీతం !
ఓహోహో కపోతం :



## అనంతస్వప్నం.

రండి రండి నరులారా ! రండి వియచ్చరులారా !
రండి లోకంలోపలనే కొలువుండండీ !

ఆకాశమ్మే ఛత్రము
అవనియె సింహాసనమ్మె
అంబుధి రత్నాగారము
అనిలమె వింజామరమ్మె!
రండి, రండి జనులారా! రండి నిరంజనులారా!
రండీ లోకంలోపలనే ప్రసరించండీ!
తూరుపు దిశనుంచి మొదలు
పడమర దిశవరకు ప్రాకు
అరుణ కిరణ స్వర్ణకాంతి
నవమానవ మహాగీతి!
రండి రవిచ్ఛవులారా! రండి జగచ్ఛవుల..
రండీ నూతనజీవితమే విరచించండి!
దశదిశలూ మహావిశ్వ
సౌధానికి అరిగాపులు
అహర్నిశలు సౌధాంగణ
పాలకులకు కన్నురెప్పలు!
రండి దురంధరులారా! రండి దిగంబరులారా!
రండీ లోకంలోపలనే నెలవుండండీ!
జీవితమిక సుఖసుషుప్తి
కాలమె స్వప్నానురక్తి
మానవోత్తమాదర్శం
విశ్వోచ్ఛ్వాసమ్మె యింక!

రండి రండి నరులారా ! రండి చిదంబరులారా !
రండీ మానవలోకము నవలోకించండీ !

భవదుజ్వల హృదయకాంతి
భావికాల లోకశాంతి
శాంతి జగత్కాంతియయ్యె
బ్రతుకే విశ్రాంతియయ్యె !

రండి రండి నరులారా ! రండిర సుందరులారా !
రండి నిరంజనులారా ! రండి జగజ్జనులారా !



## శైలాఅంతిమగీత 1

వేసవికాలం కుశాయి ప్రక్కన
ఖాళీ బిందెలవలె పడిగాపులు
పడ్డవి మనజీవితాలు :
ఇంకీ ఎండిన గొంతుల నీళ్లుపోసి
తడుపుకొనే ధీమా ఏమాత్రం లేదునాకు.
ఈ వెధవ ప్రపంచాని కవతల
నీ పెదవులు నిలుచుని
నా కథయాన్నిస్తున్నవి !
ఇంత విశాలప్రపంచాన్ని బంధించిన
కవుగిలి బిగి సడలుతూన్నదక్కడ !

పదే పదే బలవంతంగా నెన్నడుమదిమే
చేతులు పట్టుతప్పి జారుతునే వున్నవి.

ఇక్కడ కాపోతే నేంలే ;
అక్కడ నీదాన్నే ప్రియతమ్ !
ఇప్పుడు కాపోతేనేంలే
ఎపుడూ నీదాన్నే కాదా అక్కడ ?

చూశావా, పాపం సూర్యుడు
మన కతదాకదే సాయంచేసే
మిత్రుడు !
అనుకొన్న ప్రకారం ఈపాటికి
సాంకేతిక స్థలాన్ని చేరితి
మనుకున్నాడేమో పాపం !
పెట్టీ బెడ్డింగూ నెత్తికెత్తి
మన కలవేసిన రైలుబాట ప్రక్కన
కాల్నడకని పయనం సాగిస్తున్నాడు

మవ్వూనేనూ తప్పించి భవిష్యత్తు
చూవత్తూ ముందడుగే వేస్తున్నది.
ఏమయ్యా మాటాడవ్ ప్రియతమ్ ?
మిటి రమణ మహర్షి పూవం !



# శైలాగ్రాంతిమగీత 2

నా కభిముఖమై ప్రయాణించు ఓ బికారి
ఆగి వినుము నే చెప్పెడి దొక్కసారి !

నడచినడచి అడుగడుగున తడబడి
మనుగడలో ప్రతి మజిలీ వెలువడి
ఆఖరికి శిఖరాగ్రం చేరుకొంటి నీవేళకు
నే చూచిన చిత్రాలవె తిరిగిచూడు మావైపు !

అలిసిసొమ్మసిలిఒగుర్చుస్తున్నది సంద్రం
పాలిపోయి తేలవేసె ముఖమును చంద్రుడు
పొంగిన యవ్వనమేనాడో చల్లారెను చప్పగ
ఓడినగుర్రాలల్లే పరుగిడుతున్నవి కోర్కెలు :

తడియారని దప్పిగొన్న కుత్తుకవలె వెన్నెల
రేయెండకె గుండెమండిపోతున్నది
ఒంటరినగు నాప్రక్కన ఒక్కతియైవిశ్వం !
విశ్వం-నేనూ; నేనూ-విశ్వం !

నేనూ?—కాదు, నాపొడుగాటినీడ
వేలవసంతాల యోజనాలు ప్రాకిన నీడ !
నీడల క్రీనీడలలో మసలినకాలం
త్రుంచెను నా యాత్రికమూలం !

చూచేయోగ్యత కోల్పోయెను కన్నులు
తొల్లిటినల్లటి తల్లికడుపులో తమములు
ఆవరించుతున్నవి మళ్ళీ మనసును
అపహరించుచుంటి మళ్ళీ గతమును !

చెప్పాల్సిన దింతేనయ ఓ బికారి !
ప్రయాణించుమికమీదట ఎదోదారి !



# గీతికాస్వాగతం

జగతిని చుట్టిన భీతివంటి చీకటి...చీకటిలో మినుకు మినుకుమనే తారకలు....కోటికోట్ల తారకలు... మానవుని ఆశయాలకిమల్లే మెరుస్తున్నవి....ఆడిపోతున్నవి....

ఒకతారక :

"అర్ధరాత్రి నికుంజగర్భము
విరియు రేపటిపూలుకలవో
విశ్వమానవ ప్రేమదామము
వేగమే విరచింపరండో !

సుప్రసిద్ధ జెక్ దేశభక్తుడు జూలియస్ ఫ్యూజిక్....యెదురుగా కటకటాల వికట్టాహాసం....ఒంటరిగా పెనుగులాడే జూలియస్ ఫ్యూజిక్

"నేనేకాని కాదు కాదు
నాకెవరూ తోడు లేకపోలేదు....
నేనీ కఠోర కటకటాల నిర్బంధము నందున
దుర్భరజీవితాన్ని వెళబోస్తున్నా
నేనేకాకిని కాదుకాదు
నాకెవరూ తోడు లేకపోలేదు....

కరుణలేని కటికచీకటి: చిక్కని నల్లనిచీకటి... చీకటిని చీల్చుకుంటూ పావురాయి రెక్కలవంటి తెల్లని సన్నని ధ్వనితరంగాలు....

"మీరనవరతం కోరే శాంతిని
మీరొకపరి పెదవి కదిపి నినదిస్తే
చండశాసనులు ప్రపంచానికే వెలియై
భూనభోంతరాలకు చెల్లాచెదరై పారా....
మీచల్లని కరాలు చల్లిన వరాలు
మామక మస్తకముల నభిషేకించవ....
మాయీ రేచీకటి పూదోటలో
వికసించని కోరకతారకాళి ఒక్కసారి
చిరునగవుల కాంతులనే విరియించవ....
మీరనవరతం కోరే శాంతిని
మీరొకపరి పెదవి కదిపి నినదిస్తే...."

జూలియస్ ఫ్యూజిక్ :

"నాయీ శిధిలాలయమున హృదయము

చిరుగంటల రొదగా మ్రోగే సమయము
ఊపిరి ఓంకారముగా వినిపిస్తా రెవరయ్యా
సమతాధర్మము శంఖారవముగ దిక్కులు
పిక్కటిల్ల పూరిస్తా రెవరయ్యా
చీకటి జీవిత కారాగారము లోపల
అరుణారుణ ద్యుతులై స్నేహితులై
నా మ్రోలను వ్రేలాడెద రెవరయ్యా"

అగస్తినా ఫ్యూజిక్ :

"నువ్వు నాకు దూరమైన రోజున
కాళ్ళుతెగిన సూర్యరశ్మి ప్రాకలేని రోజున
మృత్యువె ముల్లాయెనే తరాజునా
బ్రతుకే భూభారమైన రోజున....

జూలియస్ ఫ్యూజిక్ :

"పెదవి కదిపి అగస్తినా
నన్ను పలకరిస్తే....
మొగ్గవిడిచి అనుక్షణము
ఒళ్ళు పులకరిస్తే....
రెక్కతొడిగి కోరిక
వినువీధి నెగురనిస్తే, ..
చెరసాలకు సారసాలు
ప్రేమ పూసరాలా....

అవధిలేని హృదయానికి
రాతిగోడ హద్దా....?
ఆపులేని నాయాత్రికి
అంతు కటకటాలా....?
పొంగిపొరలు జనఘోషకు
భువి చెలియలికట్టా....?
అరుణారుణ పతాకమున
కట్టు కారుమేఘమా....?

చిత్రం....దేశానికీ దేశానికీ మధ్యవుండే విభేదాలన్నీ చెరిగి ప్రపంచమంతా ఒకేదేహంతో సందేహావృతయై విస్తుపోతూన్నది....ఒకేభయంతో ఒకేభీభత్సంతో.... వణికిపోతూన్నది ...చీకటి జీమూతంలా....భూతంలా విజృంభిస్తూనేవుంది....

నేను :

"అడుగు అడుగున మృత్యువు పడగలెత్తు
జీవితమె భీకరారణ్య క్షేత్రమే మొ
అల్లనల నల్లనల్లగ నలముకొనెడు
చీకటియె వెల్లు దిగమ్రింగు ఘూకమే మొ !"

1943 : సెప్టెంబరు ఎనిమిదవతేదీ....ఆకాశం ఆకలితో నోరావలిస్తున్నది.... నిస్సహాయులైన ఎందరో మానవులు చీకటి విద్రోహశక్తులకి ఆహుతి అవుతున్నారు....జూలియస్ ఫ్యూజిక్ వురితీయబడ్డాడు. నిద్దట్లో రోదసి ఒక పొలికేక వేసింది....

వసుధకడుగిడు సూర్యబింబము
నాచికొనెనే కాలసర్పము
గ్రహణశూలకు లోకమంతా
మొర్రి యేర్పడియెన్ !

ఏవో నిద్ర....ఏవో కల....కలలో నిద్ర....నిద్రలో కల....ఎంత అందమైన కల ! 1945 మే....దివ్యవసంతం....ఇంతటి సంతసం ఈమధ్యని ఎన్నడూ చూడనే లేదు.... రెడ్ స్క్వేర్ ! ఎర్రని అరుణోదయంలో మెరిసే ప్రపంచమే ఒక రెడ్ స్క్వేర్‌లా అవుపిస్తోంది... మానవ హృదయ సీమలలోని భయం నశించి భావి చివురిస్తున్నది.... ప్రకృతిలోని చరాచర సర్వస్వం తిర్యగ్జంతు సమస్తం....వసంతగీతిని ప్రవచిస్తున్నాయి....

"రండి రండి అన్నల్లారా !
రండర్రా కనుపండువుగా !
అమ్మ ప్రేమ పచ్చనిచెట్లయి
అన్నలార చివురించెనురా !
కోయిలవలె కోరికగొంతులు
కొమ్మకొమ్మపై కూసినవర్రా !
రండి రండి అన్నల్లారా !
రండర్రా కనుపండువుగా !
సంతసాల సంతర్పణలో
ఆకాశం గోకర్ణంతో
ఆనందం వర్షిస్తున్నది !
భూమి బ్రహ్మాండై
భుజియిస్తున్నది !"

వ్యక్తావ్యక్తమైన ధ్వనులు... సరాసరి ఆకాశంమీంచి భూమిపై ప్రసరించి లెక్కలేనన్ని సూర్యకిరణాలవలె లోకాన్ని పునీతం చేస్తున్నవి....

దిశాంతములనుండి :

"నా సోదరులానందోత్సవ సమయపు కోలాహలమో
ఎఱ్ఱనిగులాబి పతాకాలమీటుగ వీచిన మలయానిలమో
ఏనరకాసుర మరణానంతర దీపావళియో
విరితీగె మతాబుల వెలుగులతో గుబాళించు"

ఆకాశవాణి :

కలకాదు కలకాదు కలకాదు కామ్రేడ్
కనువిప్పి మునుముందుకే చనుము కామ్రేడ్ !
నీచేయి నాచేయి మెయి మేయి కలియా
నీగొంతు నాగొంతు ఒక్కటై మొరయా
శోకాలు పాతాళ లోకాల కలియా
లోకాలు ఆనంద సంద్రాల దనియా
కలకాదు కలకాదు అగును నీకభయం
కనువిప్పి ముందుకే చనుమనెను హృదయం
కలకాదు కలకాదు కలకాదు కామ్రేడ్
కనువిప్పి మునుముందుకే చనుము కామ్రేడ్ !
అడుగుపెట్టినదెల్ల యానందమండపము
గొంతువిప్పినదంత సంగీతరూపకము
సంస్కృతీజ్యోతుల్లో సాహితీశోభలో

మానవమనస్సీమ క్షేమమేర్పడు నింక
కలకాదు కలకాదు కలకాదు నేస్తం
కలకాల మీవెలుగు లేలును సమస్తం ;

నేను :

భయద జీమూతావృతాంధము
చెదరి చదలే నగవు లీనగ
విశ్వసుప్తి శశాంకరోచి
స్వప్నరేఖలు కావ్యమైతోచెన్ !





# సయాజహానా

(కవితావాహిని)



శ్రీకారం నిర్మించిన
సాలిగూళ్ళలో దాగిన
గరళ మీమ్మ ప్రపంచమై
ధౌతహిమాచలోచ్చలిత
జలదాలే మానవునికి
జీవిత ఋతుపవనాలై
పర్జన్యపు గర్జనలే
జగజ్జనుల నినదాలై
భూవలయిత బాధార్ణవ
తరంగాల ఆర్తరుతులు
ఆకాశపు టవధులలో
ప్రతిధ్వనిత గాత్రాలై
ఆకాశపు మహాదర్శ దర్శనలో
రక్తాంకిత జగద్దేహ
చలనం ప్రతిబింబితమై
శ్రమాఖిన్న విశ్వఫాల
స్నపిత స్వేదఝరీవారి
వియత్తల సువిశాలాక్షి
ఆర్ద్రహృదయ వీక్షణలై
గంగా, యమునా, గౌతమి.
వాల్గా డాన్యూబు థేమ్సు
ఒరెనాకో నైలు రైను

నయాగరా జలపాతాలు
హోయాంగ్-హో స్వర్ణముఖీ
యాంగ్-సీ ఐరావతీ
మహానదుల ప్రవాహాలు
విప్లవ జనసమూహమై
ప్రాచ్యప్రతీచీ మహోదధీ
హృదయాంతర జ్వలిత
అరుణారుణ రాగసంధ్య
భూగోళాందోళనలో
ఆరోహిత కేతకమై
పురోగామి దీపకమై
విశ్వశ్రామిక హృదయం
విలపించే సముద్రమై
త్రికాలాల ప్రభవించే
ప్రకృతిలీల విచిత్రమై

అనాదిలో అగ్నిద్రవ నిర్నిద్రాకృతిమై
ఘనీభావ కర్కశత్వ పాషాణాంతర్భవమై
నిశ్చేతన నిర్జీవన నిద్రాముద్రితమూర్తై
క్రమక్రమః పరివర్తిత జాగృతజీవనమై
సుప్తచలిత జనితజ్వలిత
చైతన్యాంతర ప్రేరిత

భువి చైత్రోత్సవమై
పుడమి కడుపు పండి నరుడు
అధిష్టాన దేవతయై
ప్రసవించిన వసుంధర రసాలసాల
ఫలరసాల ఖాదియై
విశ్వ మహాసృష్టికి
తొలిమానవుడే నేతయై
రోజులు వారాలు నెలలు
ఋతువు లాయనాలు ఏళ్ళు
దశాబ్దాలు శతాబ్దాలు
లిప్తలుగా గడపి
వసుమతీ సమస్తభాగ్య
భోగాల దురాక్రమించి
దాచుకొనే స్వార్థచింత
జనియించిన దాదిగా
గుంపు గుంపు నడుమగడ్త
మనిషి మనిషి మధ్య గోడ
పరస్పరం సంఘర్షణ
అనవరతం సలిపి,—
జనతా జీవనవాహిని
అనంతమై అమరమై
నాటినుంచి నేటివరకు

నిరవధిగా గడచీ
నరకలోక పిశాచాల
వికారాల సుదూరాల తరిమీ
ఈ జగాన నవసమాజ సృజనోత్సవ
సుప్రభాత కాంతిరేఖ తెల్లయెడల బరపీ
వర్ధమాన భువిచరిత్ర నాయెడంద నిలచీ,
భూగోళపు గోళాకృతి మందస్మిత చారువదన
మస్మదుజ్వలాంతరంగ పీఠముపై వెలసీ,
దేశదేశములను రేగు మానవయత్నాల భ్రమరి
నాయెద కనుదమ్ములలో కొదలు లేపి కలచీ,
విశ్వ మహావిప్లవ గీర్వాణి కేలుదోయి సోకి.
నా శరీరసర్వస్వం పులకించెను వీణయై !
నవగానా లాలపించి మ్రోగుతోంది శరీరం
నవరాగము మేళవించి తిరుగుతోంది భూగోళం
నవజీవము మేలుకొలిపి ప్రసరించెను సమీరం
నవకాంతుల రంగరించి రగులుతోంది ఖగోళం :

గిర గిర గిర తిరుగుతోంది భూగోళం !
తీరానికి తాకుతోంది బంగాళాఖాతం !
బంగాళం నేపాళం పాంచాలం సౌవీరం
గాంధారం కాశ్మీరం కాంభోజం దగ్గరగా
కళింగమూ త్రిలింగమూ తమిళం మళయాళం
కోంకణమూ శేంకణమూ భూతలాన సందడిగా
భూతకాల కాయమాన చైత్యద్రుమచ్ఛాయలలో
శాంతంగా సౌమ్యంగా వీచుగాలి కలచీ
అశోకుల్ని విశేషుల్ని సిలువలపై నిలిపే
అశరీరుల ఉపదేష్టల విలువల పోనాడే
కాలం సుడిగాలి విసరు వడిసెలలకు బెదరీ
స్వర్ణయుగం కన్నదినం రెక్కలు విదలించీ
గిర గిర గిర తిరుగుతోంది భూగోళం
కర కర కర పొద్దుపొడిచె ఖగోళం
తళతళలను బింబించెను బంగాళాఖాతం ;
అదిగో : అదిగదిగో !
భూభృద్భువ ఝరీవేగ సంగీతం
గంగానది కాదుకాదు తంబీ !
హిమాలయం గుండెపగిలి
పొంగులు పెగలు సుమ్మీ !
సదాసస్య చిద్విలాస కేదారం
గోదావరి కాదుకాదు తంబీ :

నిరాహార పరాభూత హాలాయుధుల
శోకాక్షుల బాష్పవారి సుమ్మీ !
నల్లద్రాక్ష గుత్తులు సంపుల్ల
హల్లకమ్ముల వేతంబీ !
మధువుకాదు రుధిరం
ఆనాడులలో సుమ్మీ !

అవుగో ! అవుగవుగో !
లాహోరూ....అమృతసరూ....కలకత్తా....నౌఖాలీ !
మలబారూ....మద్రాసూ....గోల్డెన్‌రాక్....కయ్యూరూ !
ఎలమర్రూ ...కాటూరూ....నల్లగొండ....రాజోలూ !
ముక్కలైన పంజాబూ....సగం తెగిన బెంగాలూ !
చెరచబడిన వనితలాగ
వివస్త్రయై కృష్ణానది !
కనిపెంచిన గారాబు
కుమారుల పోగొట్టుకున్న
తల్లిలాగ వేదనతో
రోదనతో తెలంగాణ !

అదిగో ! అల్లదిగో !
నావికసమరోత్సాహము
తెల్లవాణ్ణి తొలగమన్న
బొంబాయది కాదు కాదు తంబీ !

ఆలిముప్పు గడుపలేని
వేతనాల వేదనపడు
అసమర్థుల జీవితకథ సుమ్మీ !
పొగలతో ఖగోళమంటు నగరం
జెంషడ్పూ రసలెకాదు తంబీ !
సమ్మెటతో తూట్లుపోయి
సౌఖ్యాలను కోలుపోయి
శ్లేష్మమూదు కొలిమితిత్తి సుమ్మీ !
ఆఖరి పహరాను దాటి
అంతఃపురిలో చొరబడు
చలికాలం ఢిల్లీలో
చూడబడదు తంబీ !
డిసెంబరులో దిగంబరుల
పేవ్‌మెంట్ల పార్లమెంట్లు
వీక్షించవు సుమ్మీ !

అహగో ! అరుగరుగో !
లజపతిరాయ్ భగత్సింగ్
టాగూరూ ఎగ్బాలూ
ఆకాశపు టవధులలో
విస్తుపోయి చూస్తున్నారరుగో !
స్వాతంత్ర్యం సిద్ధించిన

అనంతరం నిరంతరం
చింతలేని సంతసాల
నూహించిన జీవితాల
కాల్వలుగా సంద్రాలుగ
ప్రవహించే దుఃఖాలను ;
సిరిసంపద సృష్టించే
కూలివాళ్ల చేతులపై
తగులుకొన్న తెగని
ఇనుప సంకెళ్లను ;
బాధపడే ప్రతీవాడి
జీవితాన్ని ప్రగతివైపు
పల్కించే కంఠాలకు
బిగుసుకున్న ఉరిత్రాళ్లను ;
ప్రజాకవులు మొహియుద్దీన్
కిషన్‌చంద రబ్బాసూ
సోమసుంద రనిసెట్టీ
ఆరుద్రా శ్రీశ్రీల
గొంతుల లోపల పాతుకు
పైకిరాని గీతాలను,—
టాగూరూ....ఎగ్బాలూ....
ఆకాశపు టవధులలో
విస్తుపోయి చూస్తున్నా రదుగో!

అరుగో! అరుగరుగో!
ఎవరో! ఎవరెవరో!
ఆర్తులు అన్నార్తులు
దుఃఖాశ్రుమాల విషశ్రుమాల
విపత్తుల్ని గుచ్చి
కంఠాలను విజిగీషల
చిరుగీతుల నించీ
సంక్షోభః కంభోజము
కంధరాల కూడీ
కాంక్షను సుస్వాగతాల
తోరణాల వేర్చి
ఎవరో! ఎవరెవరో:
నిరంజనులు భయాందోళ ప్రకంపితులు సకలజనులు
విరించనుని స్వయంకృషికి ఖిన్నమనఃఖడ్గధరులు
పాశాలకు స్వప్నమాత్రి క్లేశాలకు వంచితులై
భారాలకు తమ్మికాడ దారాలకు బంధితులై :

ఎవరో! ఎవరెవరో!
బెంగాల్ క్షామంలో పీపునంటు కడుపులవలె
దుక్కిదున్ని దుఃఖం పండించుకున్న రైతులవలె
అన్నమొకటి మినహాగా ఆకలిగల మనుషులవలె
చనుబాలను చేపలేని తల్లులపై పిల్లలవలె:

ఎవరో : ఎవరెవరో !
ఆర్తులు అన్నార్తులు
దుఃఖాశ్రుమాల విద్రుమమాల
విపత్తుల్ని గ్రుచ్చి,
స్వాగతమే తమ గీతంగా
స్వాగత హారతిపళ్ళెం
పడుతున్నా రరుగో !

"ఈ మా వినిర్మలాకాశంలో
నల్లమేఘాల్ చరిస్తున్నవి !
ఈ మా విశాలలోకంలోపల
వృక్షాల్ మూలుగుతున్నవి ?
క్రమక్రమంగా సూర్యుడు సహితం
దిగజారి పోతున్నాడిలపై
పచ్చటి నులివెచ్చటి దిన సౌందర్యం
పసివాడి పోతూన్నది కలమై !
ఏమో.... ఏమీ బోధపడదు తల్లీ !
గడియారం ముళ్ళమధ్య ఇరుక్కున్న కాలం
సాలిగూడు లోకాన్నెంచాతో త్రెంచలేదు జననీ !
జైలుగోడ లెగబ్రాకే ఆశాలతలేమో
ఫలరహితంగా నేల వ్రాలిలుమాతా !
ఖద్దరు ధోవతిలో మలుచుకుంది మాతా మరణం.

గాంధీటోపీలో పొంచున్నది మాతా మరణం !
ఏమో.... ఏమీ అవగతమవటం లేదమ్మా !
ప్రేమ కటకటాల చుపెను చుట్టూ మరణం
పెళ్ళి కంకణాన్ని కట్టెను తల్లీ మరణం
కౌవిలించుకు మోవి నందించెనమ్మా మరణం
నిస్సిగ్గుగ నవ్వుతోంది మాతా మరణం !

మరణం.... మరణం ...మరణం. ..
మరణా న్నెరుగుదుమమ్మా
కలరా నెరుగుదుమమ్మా
ప్లేగు మాకు తెలుసు !
భగత్సింగు బలిపీఠం
మే మెరుగనిది కాదు !
భీతావహ శీతహస్త పీడన
మాకంతానికి ఆనవాలె తల్లీ !
శక్తిలాంటి విచ్చుకత్తిలాంటి
మరణా న్నెరుగుదు మమ్మా
పులినోట యెరవడ్డ పలలాన్ని మరణాన్ని
కలికంట విడివడ్డ అనలాన్ని మరణాన్ని
భీభత్సరసపూర్ణ తరుణాన్ని మరణాన్ని
మరణాన్ని.... మరణాన్ని ..:. మరణాన్ని
మరణా న్నెరుగుదు మమ్మా !

కాని,—
ప్రేమలాగ,
త్రాచు పాములాగ
చుడుతోందమ్మా ఏదో....
పువ్వుమీంచిపీచి
నవ్వులోంచితోచి
కవ్విస్తోందమ్మా ఏదో....
చేతిలోన చేయికలిపి
నలిపేస్తోందమ్మా ఏదో....
కన్నులలో కనులు నిలిపి
కలచేస్తోందమ్మా ఏదో....
ఆకలిచిచ్చుకు ఆకుపచ్చ
రంగేస్తున్నది తల్లీ!
పెదవుల చిరునవ్వించే
ప్రాణాలెత్తుక పోతోందమ్మా!
ఏవేవో నవ్వులు తల్లీ!
ఏవేవో సువాసనల పువ్వులు
ఎర్రకోటమీంచి పీచి యావద్భారతాన్ని
ముంచేస్తున్నవి మాతా!
సుందరకాశ్మీరం నెత్తురుమయమై
పోయిందా నవ్వుకొరకు!
మానవ మందారాల్ మకరందం

స్యందించిన విషట్పదముకు !
శ్రోత్రపేయగీతానికి ప్రోడుపెడద
చివరించిన చెవులే
ఈ పరభృతాని కాహారం తల్లీ !

ఖద్దరు సుర్వాలో మలుచుకుంది మాతా మరణం
కాబూల్ శాండల్లో పొంచున్నది మాతా మరణం
ఎర్రకోటమీంచివీచి యావద్భారతాన్ని
ముంచేస్తున్నది మాతా మరణం !
మరణం ! మరణం ! మరణం !

....ఏమైనా భయంలేదు !
వీవనియ్యి వీవనియ్యి
దుర్మార్గపు దుమారాన్ని
లేవనియ్యి లేవనియ్యి
అవనీతలి అగ్నిశిఖలు
చూడనియ్యి చూడనియ్యి
భీభత్సం మాకన్నులు
సోకనియ్యి సోకనియ్యి
మావీనుల నీరోదన
పీల్చనియ్యి పీల్చనియ్యి
విషవాయువు మాఘ్రాణులు
తాకనియ్యి తాకనియ్యి

ఈ మృత్యువు శీతలమ్మొ
కడుపు శోకమెరిగివున్న
కన్నతల్లి, కన్నీరే
మున్నీరై పొంగనియ్యి!
ఒక్కఘడియ నీకన్నులు
తెరచియుంచు మచేచాలు!
నీ చల్లని కటాక్షముల
వీక్షించుము అదేచాలు!
ఇక్కడ నిలుచుండీ గాని
కారడవులు పర్వతాలు
మహానదులు గడచిగాని
మేం చూసిన స్వప్నాలను
ఈ భువిపై నిల్పుతాము!
అంతదనుక మేమెవరము
వెనుకంజను వెయ్యబోము!
మా వెనుకను మా తమ్ములు
వారివెనుక అనుజన్ములు
అనుజన్ములు అనుచరులై
ఒకరి వెనుక ఒకరుగ
మేమనవరతం నడుస్తాము!
ఉన్మత్తో ద్రేకములో
ఉదధిపొంగి చదలు ముట్టి

దూరాలకు ప్రాకుతుంది !
పాపం ఈ నేల తల్లి
ఎటుపెడితో అటేదారి
చేసిపెట్టు నెల్లయెడల ;
గాద్గదిక కంఠమ్ములు
ఎలుగెత్తే పొలికేకలు
ఎడారులను మైదానాల్
ప్రతిచోటా ధ్వనియించును
ఈఘాతాల్ పాతాళము
దిగబడి ఘోనుంకించును !
మా కోరిక కోయిలలో
పాతపాట జ్ఞాపకాలు
గొంతువీడి ప్రవహించును :
మా యెదలను పాడగలుగు
శక్తుల నుద్రేకించును !
ఈ ప్రపంచ విపంచిపై
లక్షలాది కంఠమ్ములు
గొంతులెత్తి శృతిగల్పును !

నవ యుగాది పూతబెట్టి
కవి అనాది తోబుట్టువు
చీరకొనల వ్రేలాడును !

తూరుపుదిశ ప్రొద్దుపొడిచి
తోబుట్టువు ముఖము విడిచి
పసుపురంగు పురుడించును !
తోబుట్టువు కొప్పులోంచి
మందారం తొంగిచూచి
అందరినీ పలుకరించు !
వరివెన్నుల నోట కరచి
పిచ్చుకలై హెచ్చరికను
ఎగురునులే మాఆశలు
మా ఆశలు ! మా ఆశలు !

గిర గిర గిర తిరుగుతోంది భూగోళం
చూపుమేర దూరంలో కనిపించే భారతం
ముప్రిక్కలి తీరాలకు తాకుతోంది సముద్రం
హిమగిరిపై కురుస్తోంది అరుణోదయ ప్రసారం
తరగలవడి పెంచుతోంది అరేబియా సముద్రం
గిర గిర మని తిరుగుతోంది భూగోళం !

*

నా యెట్టయెదుట
నిట్టనిలువుగా నిలుచుని భూగోళం
గిర గిర గిర గిర గిర గిర
తిరుగుతోంది !
దారీ తెన్నూ తెలియని
అడవులు !
ఎత్తుగ ఆకాశంలో
నిలుచుని హిట్లరువలె
విర్రవీగి భయపెట్టే
కొండలు !
లోతయి చీకటియై
దరిద్రమున ఆకలివలె
చుట్టుకొనే ముసురుకొనే
లోయలు !
కొండలుగా లోయలుగా
ప్రపంచాన్ని చీడపురుగు
పీడించుక వెళిపోయెను !
గంగా సింధూ మైదానంవలె
సస్యవృద్ధి నాశిస్తూ
సఫలత నాకాంక్షిస్తూ
భూగోళం తిరుగుతోంది !
భూగోళం పరిభ్రమణం కారణమై

చీకటి వెలుతురుగా
నరకం నాకంగా మారుతోంది :

భరతావని కుత్తరంపు టెల్లయి
ఎల్లలోకముల సమీక్షించు శిరమై
హిమవద్గిరీ దరీ సరోవరమున
వేసవి మధ్యాహ్నం నీరుత్రావి
పక్షులు పక్షంచముల విసరుచు
ఉత్తరాభిముఖమై అంతరిక్ష
మార్గాన్ననుసరించి సాగించే
పయనమునకు గమ్యం ఆదేశం !
ఎర్రనియాపిలు పండ్లతోట కావాసం !
అదె సోవియట్ల దేశం !
ప్రపంచపీడక జంబుకాల బారినుండి
తప్పించుకున్న పళ్లతోట !
నవజీవిత ప్రభాతమున
చల్లని వసంతమున
నిరంతరం సంతోషం వర్షిస్తూ
కన్నుల పండువుగా
నందనవన మానందోన్మీలనమున
నవ్వులవలె పువుటెత్తుల
సుమిస్తూన్న దదిగో !

అరుగో! అరుగరుగో!
సోదర మానవులంతా ఒకటై
కథలోవలె కలలోవలె
స్వార్థాలను త్రెంచుక ప్రేమలాగ
ప్రవహిస్తున్నా రరుగో!
కవులూ కళాకారులూ
వేదాంతులు శాస్త్రవేత్తలూ
కార్మికులూ ఇంజనీర్లు
పుడమికి పసిడివెల్గు పూసే
ప్రభాకరోద్దీప్తులవలె
ప్రభవిస్తున్నా రరుగో!
స్త్రీలూ పురుషులు
కంఠాలను సవరించుక
సంభ్రమమున నవథమరుచు
మ్రోగిస్తున్నా రరుగో!
జరామరణరుజాగ్రస్త జీవితాన్ని
నిరసిస్తున్నా రరుగో!
సదానంద సుహృద్భావ కాంక్షితాన్ని
ప్రవచిస్తున్నా రరుగో!
జగదావృత తిమిరాంతర్యుద్ధంలో
కృపాణముల నిక్వాణమై
ప్రాభాతోత్సవవేళా స్వర్ణారుణ

భానూదయ కిరణములై
దరవికసిత సుందర వదనారవింద
నిరంతర స్మేరములై
పాంచజన్య విపంచిపై
సంచితసమ్యగ్గీతాన్నాలాపిస్తున్నా రపుగో !

"ధనస్వామ్య ఆకాశ జలదమూ
జనులకివ్వ దేనాడు వర్షమూ
తొలకరించదీ భువిని జీవితం
పీల్చిపోవు కర్షకుల హర్షమూ
ఎంతకదిపినా దున్నదీహలం
ఎంతచేసినా పండదీపొలం
పచ్చబడదు భూమాత వదనమూ
రెచ్చిపోవు క్షుద్వ్యధాకథనమూ
బరువుమోయు రిక్షాల బ్రతుకులో
కరువులెక్క కూర్చుండు నిత్యమూ
తారురోడ్డుపై ధనస్వామ్యమూ
రోల్సుకారువలె చిమ్ము గర్వమూ
విధివిధానమున జారుధర్మమూ
పేదబ్రతుకులో కారుఘర్మమూ
ఇలజనించు వృక్షాల్ నైతమూ
వెలికిగ్రక్కు లాఠీలకోర్కిధమూ

ఉరులబిగిసి వేళ్లాడు శిరమ్మూ
ఊరిచివర తలవాల్చు శిశిరమూ
ధనస్వామ్య ప్రపంచమంతటా
కనంబడును నైరాశ్య జీవితం
ఉపప్లావ్యమై జగంసర్వమూ
విప్లవాత్మలై నిండు సకలమూ
పంచవర్షపీడితుల కంఠమూ
పాంచజన్యమై మ్రోయు నెల్లెడన్
పంచవర్ష పీడితానీకమూ
కంచుకోటపై జయపతాకమై
ఛిద్రితారియై నిల్చునవితలం
విద్యుద్దండమై గెల్చునరిబలం :
ఉపప్లావ్యమై జగం సర్వమూ
విప్లవాత్మలై నిండు సకలమూ !"

తోటవలె పొదనూపి
పాటవలె నెదనూపి
తిరుగుబాటై సకల
పీడితుల నడిపించు
శక్తివలె సింబ్రిస్క్ !
విముక్తివలె వాల్గా !
ఆశావశేషా వి

హేయసాంతర ప
తాకమై క్రెమ్లిన్
సుయోధుడై స్టాలిన్ !
విశ్వమానవ జీవి
తైశ్వర్యకాంక్ష ఠన
కామ్యమై మాస్కో
కావ్యమై గోర్కీ !
చల్లనై సన్ననై
పరతెంచు గీతమై
పరచెన్ ప్రభాతం !
తెల్లనై మల్లెవలె
వికసించె జీవితం !

*

గిర గిర మని గిర గిర మని
తిరుగుతోంది భూగోళం
భూగోళ పరిభ్రమణం కారణమై
చీకటి వెలుతురుగా
వెలుతురు చీకటిగా
మారుతోంది !
చీకటిగా వెలుతురుగా
మధ్యలోకి బ్రిద్దలుగా
విరిచిన అక్షాంశం
చుట్టుకొన్న భూగోళం
గిర్రున తిరుగుతోంది.
అదిగో !
అదిహిరోషిమా !
నీ వెపుడూ చూడని
తలపోయని దారుణమై
యెడారిలా కనిపిస్తోందా ?....
విలయరుద్ర రౌద్రంలో
వినాశకాల కేంద్రముగా
పచ్చని ఆ పంటభూమి
యెడారియై వణకుతోంది !
పేదవాళ్ల ఆకళ్ళు
మూల్గుతూన్న వాకళ్ళు

కొరకంచులు కొడపళ్ళ
జీవన్మరణాల మధ్య
సాగించిన పోరాటం
ఎర్రగ ఎరుపెక్కిన వుద్రేకం
క్షుద్రుల వికటాట్ట హాసఖేలనలో
వణికిపోయి బూడిదగా మారెను.
మానవ సంస్కృతీ నాగరికతా
పేకమేడలై కూలెను.
పసికందుల ఆనందం
నూరేళ్లూ నిండినటుల
వెల వెల మనిపోయెను.
యువ్వన జనరక్తం
సర్వవ్యాప్త చిత్రవధకు
యెదురుపొంగి ముంచెత్తగనే
ఆనకట్ట పడిపోయెను.
ఒంట్లోపచరించే
విషక్రిములు ఇట్టివనే
నిర్ధారణ జరుగకనే
ఒళ్లు చల్లబడి పోయెను.

అదిగో ! అదె హిరోషిమా !
స్మశానముకు వినాశముకు

తావులుగా రేవులుగా మారెను
ఎక్కడో ఏమారుమూలొ
చెలరేగిన రాజ్యకాంక్ష
రాజ్యకాంక్ష రాక్షసాంక్ష
పిడుగుల ఒడిదుడుకుల
వేగిల్చెను పుడమినె
పరిమార్చెను !
అదిగో ! అది హిరోషిమా
ఎడారులకును బిడారులకును
ఆలవాలమయ్యె నేడు చూడూ
నిన్న సుఖంపున్న ముఖం
దుఃఖం వెదజల్లుతోంది నేడూ !
బాధగ ....బరువుగ....
భూగోళం తిరుగుతోంధి....
గిర గిర మని
గిర గిర మని ...

*

అదిగో ! అదె !
ఆ కనిపిస్తూన్నదె,
ఈగలు మూగిన పుండై
రసికార్చేదే.—
కాళ్ళుచాచి కళ్ళను తేలవేసి
నీరస పూరిత హృదయావేదనతో
దేవుళ్ళాడేదే,—
బెర్లిన్ నగరం !
అక్కడె ఆశుద్రభూమిలోనే
చీకటి చిచ్చులుగా రేగెను !
అక్కడె ఆ సుక్షేత్రంలోనే
చరిత్ర మలుపుతిరిగి దారితప్పి
తడబడుతూన్నది !
అక్కడె ఆ మృత్యు సీమలోనే
'ప్రపంచశాంతి' కాళ్ళుచాచి
కళ్ళను తేలవేసి
కోలుకొనని దీర్ఘవ్యాధితో
బాధపడుతు దగ్గుతోంది !
కరిగిన నిశ్శబ్దంలో కదులుతు
మెరసే స్టెతస్కోపు లేమిటో
తెలియక పరీక్షగా చూస్తున్నావా ?
వారే,— ఆపరిభృతులే భైషజులై

ఎప్పటికప్పుడు రోగపరీక్ష చేస్తూ
ఏటంబాంబుల మాత్రిలుగా నొక్కుతు
బలవంతంగా మింగిస్తున్నారు.
తిండిలేక మెండుమొహం పట్టినలోకం
దిగమ్రింగినశోకం విరిసిన అశోకమై
పాపం జరలోచిక్కిన 'శాంతి'కి
మరణంలా కనిపించుతోంది!
ఆశగ—అనుమానంగా
భూగోళం తిరుగుతోంది!
జగమొక వెలుగై పేదల నిర్భాగ్యుల
అసంతృప్తి చిహ్నంగా
పిడికెళ్లను బిగియించిన
పుదేశ్రికపు వెలుగై కాలమె కరవాలంగా
చేతపట్టి ఝళిపిస్తూ జడిపిస్తూ నడుస్తూంది!
కలికాలం చీకటిపులి
ఆకలిగొని అంగలార్చి
ప్రపంచాన రంకెలేసి
పిచ్చిగ పర్వెత్తుతూంది.
భూగోళం తిరుగుతూంది.
పగబట్టిన తాచుపాము వలె
పరిభ్రమణమును సాగిస్తూన్నది!

"హోఁ ! హాఁయ్-హాఁయ్
హోఁ ! హాఁయ్-హాఁయ్
రండిరా బండి లాగండిరా !
పుడమిలో ఇడుములో
మనుగడే బడుగులా
ఎగుడులో దిగుడులో
బాడలా బండిలా
గుండెరా
రండిరా బండి లాగండిరా !

హోఁ ! హాఁయ్ – హాఁయ్
మనుగడే బాడి లాగుండెరా
రండిరా బండి లాగండిరా !
వడులలో సుడులలో
ఒడమిన కడగండ్లలో
నట్టనడుమ కడలిలో
మనుగడే పడవలా
గుండెరా
రండిరా పడవ లాగండిరా !

హోఁ ! హాఁయ్-హాఁయ్
హోఁ ! హాఁయ్-హాఁయ్
రండిరా పడవ లాగండిరా !

అడవిలో, గుబురులో
పడగ మీదడుగులా
కీడులో గోడులో
రేపుకున్న పుండులా
గుండెరా!
రండిరా మందు వేయండిరా!

హోఁ! హాఁయ్-హాఁయ్
హో! హాఁయ్-హాఁయ్
మనుగడే పుండులా గుండెరా!
రండిరా మందు వేయండిరా!

మంటలో వంటలో
బ్రద్దలైన కుండలా
గుండెలో తుండులో
దూసుకున్న గుండులా
గుండెరా!
రండిరా గుండు తీయండిరా!

హోఁ! హాఁయ్-హాఁయ్
హోఁ! హాఁయ్-హాఁయ్
రండిరా గుండు తీయండిరా!

పుడమిలో ఇడుమలో
గుండెలా గడములో
మనుగడే బడుగులా
బండలా బండిలా
గుండెరా !
రండిరా బండి లాగండిరా !

హోఁ ! హాఁయ్-హాఁయ్
హోఁ ! హాఁయ్-హాఁయ్
రండిరా బండి లాగండిరా !
రండిరా కండకై
రండిరా తిండికై
రండిరా బండి లాగండిరా !"

పిలిచిన చైనా పిలుపుకు
కలతే కరగెనొ నిదురను కలతను కుమితే
ఇల గల నరులందర మేల్
కొలుపగ భూగోళమె తిరుగుట కెంచినదో
గిర గిర మని గిర గిర మని
తిరుగుతూంది భూగోళం !

అదిగో అది చైనా !
ఏదో చెబుతూన్నది వినుమన్నా !

నరులను అతివృష్టిలో అనావృష్టిలో
ముంచెత్తే నదులిక స్వార్థపరుల
సముచ్ఛ్రిమున కలియవుటన్నా !
సస్యశ్యామలమగు దేశం సృష్టిస్తామని
ఏతత్సాధనకోసం కష్టిస్తామని
వాగ్దానం చేసెనటన్నా !
లాభంపెరుగని పక్షంలో
భీష్మించుకు కూర్చుండే
ఫ్యాక్టరీలు కూలివాళ్ళ
అవసరాలు తీరేవరకూ
దేశం యావత్తూ సుభిక్ష
మొనరించే వరకూ
తిరుగునటన్నా !
మన్నుతిన్న పాములవలె
కిక్కురు మనకుండా
పడిమగ్గిన పేదల
పీడించే దుష్టశక్తి,—
తిండీ బట్టా చివరికింత
భూమిపైని నివసించేందుకు
నైతం ఆస్కారం లేకుండా
పడవల్లపై జీవితాల
ధ్వర్లించిన దుష్టశక్తి,—

ఆ పేదల నిర్భాగ్యుల
చేతుల్లోనే ఆఖరవక
తప్పదుటన్నా !
షాన్సీలో బొగ్గు దొరకుతున్నా
ఇఛాంగులో ప్రత్తి పండుతున్నా
చైనారైతుల దుస్థులదుస్థితి
తొలగించని రోజులు ఎన్నాళ్ళో
రాజ్యం చేయవుటన్నా !

అదిగో ! అది చైనా !
ఏదో వెలిగిస్తూన్నది చూడన్నా !
ఆకాశం కడుపుమండి
అరుణరేఖ ఉదయించినవో
భూగర్భం బీటలుపడి
అసంతృప్తి ప్రసవించినదో
శ్రామికజనశక్తి కదలి
పరుగెత్తే పొగబళ్ళై
దీనుల దురదృష్టపు
జీవితాలు చిటపటమని
పేలే బొగ్గయి పోయినవో !
లోకంబాకాలోపలి కేకలు
ఉచ్చైస్స్వరముల రెచ్చిపిలువగా

కాల్చిన లోహంపై కెత్తిన సుత్తులు
స్వార్థపరుల గుండెలపై కెగసినవో !
ఆకలితీరగ జీవించేందుకు
ఆఖరివరకూ పోరాడేందుకు
జనహృదయం కదలెనటన్నా
ధనకుధరం ఒరిగెనటన్నా !

అదిగో ! అది చైనా
ఏదో కదిపేస్తూన్నది చూడన్నా
విల్లయి మేరువు వంగెనో
వెల్లుబికిన జనులు
కుపితపీడిత హృదయాల్
కొల్లలుగా సంధించిరో
వెల్లువయై పొంగెను
నభవీధిని శరముల్ !
భగభగమండే హృదయం
పగలన్ బొగిలినటుల
కనుపడె నాకాశం
ధగధగమను కరవాలం
సుగతికి పోయనటుల
పొడసూపెను కాలం !

భూస్వామిపల్లకీ బొంగు హోయాంగ్‌హో

పేదరైతులనెల్ల నాదుకుంది!
సస్యసంపద కొల్లగొట్టు హోయాంగ్‌హో
స్వాతంత్ర్య సమరమై సాగుతోంది!
ముంచెత్తు ఉప్పెనలపొంగు హోయాంగ్‌హో
మృష్టాన్నసిద్ధికై పోరుతోంది!
పోరులా ఊరూర ఏరులా సాగుతూ
పారుహోయాంగ్‌హో పాడుతోంది!
"ఈనదిభువిన్ సిరుల
దోచుకొని దాచుకొను
రక్కసుల నుక్కణచ
పొంగిన జలౌఘం!
ఈనదిమదిన్ వుదర
క్షోభవలనన్ కుములు
పేదలకుసాధనము
సౌఖ్యములు పంచన్!
ఈ నది ప్రజాహృదయ
సీమల తమస్సులను
విప్లవ తటిత్ప్రభగ
పారిన తురంగం!
ఈనది స్వతంత్రమున కీనది సుఖైకగతి
కీనది విముక్తికి సదాసమర మెంచన్!"

గిర గిర గిర భూగోళం తిరుగుతోంది
గల గల గల గతకాలపు పండుటాకు
గాలివడికి మర్మరముగ ధ్వనిస్తోంది
బుద్ధగయను వృద్ధురాలు వటవృక్షం
పాతపాట పాడుతోంది :

"ఓ చైనా నవ్‌జవాన్
ఏడయ్యా పాహియాన్ !
అంతరాంతరముల సంతసాలు తొణికి
వొలికా యన్నాడుకదా !
వింతవింత కాంతులేవొ లోక మావ
హించా యన్నాడుకదా !
అక్రిమాల వక్రిమాలు చెరిగిదారి
పడ్డాదన్నాడుకదా !
విక్రమార్క సంక్రమణము బండిబాట
వేసిందన్నాడు కదా !
ఏదయ్యా నీకుదారి ?
ఓ చైనా బాటసారి ??
కామ్రేడో మాసియాంగ్
ఏదయ్యా పాహియాన్ !
వైజ్ఞానిక జిజ్ఞాసకు బానిసగా వారసుడై
ఉయాంగ్‌లో ఉద్భవించి

బౌద్ధమత ప్రబోధముల ఆహారం సారంతో
షాంగన్‌లో విజృంభించి
సన్యాసం గంభీరోపన్యాసం మనుగడలో
ఉరవడిగా నిర్ధరించి
మిత్రులతో టోచింగ్ ప్రభృతులతోడ
ఆతురుడై జాతరగా
భీకరమున కాకరమై చెలరేగే తుఫానులకు
ఏమీ వెసుదిరుగకుండ
గోబీ యెడారిదాటి సాఫే రహదారి నడచి
వేంచేసిన పాహియాన్ !
ఏంచూసెను నవ్‌జవాన్ !

తక్షశిలా ఉజ్జయినీ వైజ్ఞానిక పరిషత్తులు
విరజిమ్మిన ప్రబోధాలు
వాటివెనుక వసుంధరను యశోధరలు
జారిపడిన అగాధాలు
వైశాలీ నగరంలో వేశ్యమాత అంబపాలి
నిర్మించిన విహారాలు
వాటివెనుక మోడులవలె చివురించని
జీవితాల సహారాలు
పంచలాది తథాగతులు యథాగతిని ధరియించిన
కావిరంగు దుక్కలాలు

వాటివెనుక మొగములపై అగుపించని చిర్నగవుల
నాక్రమించు విచారాలు
నాగార్జున శిల్పకళా ప్రాభవమున కంతఃపుర
కాంతాజన విరాళాలు
వాటివెనుక కోటలలో పడకగదుల చీకటిలో
వినిపించని రహస్యాలు
ప్రబోధాలు - అగాధాలు
విహారాలు - సహారాలు
ప్రచారాలు - విచారాలు
విరాళాలు రహస్యాలు
ఏంచూసెను ఫాహియాన్
ఏమంటావ్ సవ్‌జవాన్ !

ఉన్నదేదో కన్నవారు
ఒకేలాగ పలుకుతారు
నాకు ప్రాచి నీవేనని
నీ ప్రతీచి నేనేనని
నీ నా స్నేహాలమధ్య
అడ్డంగా నిలుచున్నవి
హిమవద్గిరి సరీసృప
విషపూరిత జిహ్వికలని !
నీ నా అనుబంధాలకు

ఆధారం భూదేవిని
విచ్ఛేదం చేసినవీ
ఉప్పునీటి సందా్రిలని :
కామే్రిడో మాసియాం :
ఏమంటావ్ నవ్‌జవాన్ :

ఏమనసీ ఏమనసీ
ఎవరేమనసీ
భూగోళం కంకాళం
అయితేకానీ
రరరీ రరరీ
తరరంపం తరరంపం
తారంపంమ్ :

రణమారణ మధ్యస్తం
బిరిలోపలి ఆలోచన
బ్రతుకంతా పోరాడిన అనంతరం
విశ్రాంతికి అవకాశం
దొరకిన ఒక సాయంత్రిం
కొండకొమ్మమీద తుపాకీ
తలపై ఆనుకునించున్న వేళ
ఆకాశంలో విరిసిన
అవకాశంలో విసరిన
పిరికితనపు టాలోచన!

దూరాల్లో....భారాల్లో
చిక్కుకున్న సంసారం
పై మెరిసిన ఆలోచన!
తాపీగా సాఫీగా
లోలోపల పాకుతున్న
పాదరసపు టాలోచన!
సంసారం మోయలేక
సంపాదన చేయలేక
కుక్కిమలక మంచంపై
కాళ్లముడిచి కాటికి
ఎగబ్రాకబోవుతండిరి

పైన సారించిన ఆలోచన!

కూలిలేక కూడులేక
విలువలేక గెలువలేక
నిలువ త్రాణలేక కూలు
పూరిగుడిసె సంసారం
పై తూలిన ఆలోచన!

ఆకలిలో వాకలిలో
నీరసాలు నోరుసాచి
వేళ్ళాడిన సంసారం
పై వ్రాలిన ఆలోచన!
జీవితాన్ని శీలలుగా
బిగుసుకున్న నిర్ణయాల
నాసిలించిన ఆలోచన
పరివాహాన్ని సమూహాన్ని
నిలదీసిన ప్రశ్నలుగా
పేరుకున్న ఆలోచన!

*

అయితే తనకెందుకు ఈ ఉత్సాహం
అయితే తనకెందుకు ఈ వుద్రేకం?

కుక్కినులకమంచానికి
ఎత్తులు సవరించలేక
5 వేళ్ళ నోటిలోకి
సరిగా అందించలేక
ఆనందం పొందలేక
చినిగిన తన బొంతకుట్టు
సంసారం అనవరతం
సంపాదన సూదులతో
అతకలేక బతకలేక
యాతనతో గడుపలేక
ఎందుకు తనకుత్సాహం ?
ఎందుకు తనకుద్రేకం ?

*

మళ్ళీ ఒక ఆలోచన !
ముళ్ళకంచెమీద పువ్వు
వికసించిన ఆలోచన !
కష్టాలకు స్వస్తిచెప్ప
కత్తులుగా జీవితాలు
నిర్ణయించుకున్నవాడు
నిశ్చయించుకున్నవాడు
ఎలుగెత్తిన ఆలోచన

పడగెత్తిన ఆలోచన!
రాపిడిలో దోపిడిలో
ఆకురాలు కాపురాలు
విసుగెత్తిన సాయంత్రం;
ఉద్రేకం పాటలుగా
ఉత్సాహం బాటలుగా
బావుటాలు పోరాటం
తలపెట్టిన సాయంత్రం;
భీభత్సం పేటలలో
భయానకం కోటలలో
పావురాల ఆరాటం
చెలరేగిన సాయంత్రం;
పుంతలలో వంతలలో
ఎర్రదనం ప్రవహించిన
హృదంతరం పెనుప్రళయం
గుబులుకొన్న సాయంత్రం
సత్తువతో కుత్తుకతో
అందిచ్చిన సందేశం
పైమొలిచిన ఆలోచన
పరుగెత్తిన ఆలోచన!

*

"వలలోపడి మనలోకం
అభివృద్ధిని చెందదు
చిక్కిన మనలోకంలో
జీతం మనజీవితాన్ని
సీదాగా పెంచదు
అతుక్కున్న కుక్కిమంచ
మెన్నటికీ నిలువదు
అంగడిలో వున్న సరుకు
అవసరాన్ని గడుపదు
వలపన్నిన వేటగాళ్ళు
పొంచున్నారరుగో !
పదవయ్యా....అన్నయ్యా....
పదవయ్యా... పద...."

*

ఉత్సాహం యెలుగెత్తిన
ఉద్రేకం పడగెత్తిన
ఆలోచన .... ఆలోచన..
పదుగెత్తిన ఆలోచన:
విశ్రాంతీ అవకాశం
దొరకిన ఆసాయంత్రం,
నీరసాలు నిరాశలై

తొలగిన ఆసాయంత్రం,
ప్రశాంతిగా ఆకాశం
అపఘులలో అరుణకాంతి
వెలిగిన ఆసాయంత్రం
కొండమీర సిపాయీని
తుపాకిమొన నడిపించిన
ఆలోచన ....
గబ గబ గబ పయనించే
ఆలోచన:

*

స్వగతంలో గ్రీకు గెరిల్లా
తలవాల్చుకు చూచినదల్లా
ప్రతిదేశం ర-గస్థలిపై
కనిపిస్తోందొకేకథయై
కవెంట్రీ కార్ఖానాలో
మాంచెస్టర్ బొగ్గులగనిలో
వాషింగ్టన్ ఫ్యాక్టరిపనిలో
విశ్రాంతికి సమయందొరకిన
ప్రతీచోటా ఒకేయుద్ధం
అందరు న్యూగ్రీకు గెరిల్లాల్
ఆలోచనలివే నమూనాల్:

భూగోళంపై రేఖాంశాల్
అడ్డంగా అక్షాంశాలును
శీతోష్ణస్థితిలో మార్పును
సూచిస్తాయేమో కాని
ఈరోజున ప్రతిదేశంలో
బాధపడే ప్రతిహృదయంలో
ఆలోచనలివే నమూనాల్!
ఉత్తరధృవ జీవితమైనా
దక్షిణధృవ నివాసమైనా
ఉంటూన్నది ఏచోటయినా
కంటూన్నది ఇదేప్రమాదం!
భూగోళం విషాదకథయై
ఎటునుంచెటు గిరగిర తిరిగిన
తిరిగినదే మళ్ళాతిరిగిన
వెనుకటికే మళ్ళీచేరుకు
తిరిగినదో లేదో తెలియక
గిరగిరగిరమని భూగోళం
వడివడిగా వడిగాతిరుగును!

*

ఇదిరా నయాజమానా!
హృదిలో నయాతరానా!

సోషలిజం వెనిగిన ఋషియా
చీకటులను తొలగించెనులే
మూషికములు దొలిచిన చైనా
పుష్పించెను నవచైతన్యం:

ఇదిగో! నయాజమానా!
హృదిలో నయాతరానా!

న్యూయార్కున బైబిలుగ్రంథం
అణుబాంబుల ప్రసవిస్తున్నది !
బాధల పెనుతుఫాను ముసిరీ
ఆగ్నేయం ఆక్రోశించెను:

ఇదిరా! నయాజమానా!
ఇదిరా! నయాతరానా!

బాధాపరిసర్పిత దేశం
వర్ధమాన కవితావేశం
నవమానవస్మిత సౌందర్యం
కవిశశాంక జీవనగానం!

ఇదిరా! నయజమానా!
ఇదెరా! నయాతరానా!

## గ్రంధముద్రణకి తోడుపడిన ఉదారులు



శ్రీ కె. బి. విశ్వనాధం బి. ఎస్‌సి (ఎజి)

శ్రీ వి. ఎల్. ఎన్ శాస్త్రి బి. ఎస్‌సి (ఎజి)

శ్రీ ఆర్. పెంచలరెడ్డి బి. ఇ

శ్రీ మల్లయ్య

శ్రీ చిత్తజల్లు సత్యనారాయణ బి. ఎ

శ్రీ లోల్ల చిన్నారావు

శ్రీ యు. వి. కామేశ్వరరావు





కవిరాజహంస ఓలేటి పార్వతీశంగారి ద్వితీయ ప్రసూనుడు శశాంక. జననం 1929 వసంతం. 1944 నించీ శ్రీయుతులు కృష్ణశాస్త్రి వింజమూరి శివరామారావు రజనీకాంతరావుల సాహచర్యమూ, వేంకట పార్వతీశ్వర కవులు బాల్యంనించీ రంగరిస్తూ వచ్చిన కవితాక్షీరమూ, సోమసుందర్ రాంషాల మైత్రీ శశాంకని కవిగా పెంచి పెద్దవాణ్ణి చేసినవి. కనుకనే బ్రతుకుతెరువుకు సంబంధించినవృత్తి ఏదైనప్పటికీ కవిత్వమే అతని జీవనధాతువు. శ్రావ్యంగా కావ్యగానం చెయ్యడమూ, మధురంగా ఉపన్యసించడమూ అతని రూపురేఖలు.




NAYAJAMANA SESANKA | ONE RUPEE | MOLAKELU PUBLICATION